REGNo.M.2185. REG-No.N 45

Theirst Telugu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for
H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు—దక్కను

103154 GOLAKONDA PATRIKA. HYDERABAD Dn

సంపుటము ౫ } ప్రమోదూతనామ సంవత్సర మార్గశిర శు॥ ౬ బుధవారము 26—11—30 { సంచిక ౯౩

## నాల్గవ రోజు సమావేశము

### డాక్టరు మూంజీగారు

అధినివేశ స్వపరిపాలనము వెంటనే యియ్యబడునని యిర్విను ప్రభువెన్నడును వాగ్దానము చేయలేదని నేనెరుగుదును. కాని మీరు అర్హతను మీరు ప్రకటింప గలిగినచో మీకు వెంటనే అధినివేశ స్వపరిపాలనము నిచ్చెదము" అని బ్రిటను దేశీయులు సమయానుకూలమగు నౌదార్యమును చూపుచు వాగ్దాన మొనరించెదరని నే నాశించితిని. సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమును మీరిచ్చినగాని మేము సంతృప్తి నందజాలము.

### మౌలానా మహమ్మదలీ సా॥

డాక్టరు మూంజీగారితో పాటు నేనుగూడ దేశద్రోహిననియే మా దేశీయులు నడివిరి. పీలు ప్రభువుగారు వెల్లడించిన భావములు "డైహార్డ్" శాఖకు చేరినట్లు నాకు తోచినది. ఇట్టి భావములను నిర్మూలింప వలెననియే బర్కు గర్జించెను. కాని యిపుడు బ్రిటిషువారు బర్కును పూర్తిగా మరచిపోయిరి.

సంతృప్తికరమగు స్వాతంత్ర్యము మీరిచ్చట మాకిచ్చెదరా? లేనిచో యిచటనే నా గోరికట్టుటకు మీరు స్థలము నియ్యవలసి యుండును. నేను మరల బానిస దేశమునకు వెళ్లను.

ఇర్విను పరిపాలనతో నాకెట్టి సంబంధములేదు. వారి ప్రకటన మిక్కిలి ఆశాభంగకరముగా నున్నది. మన మిచట నిపుడు పత్రములను కొత్తగా వ్రాయుటయే ఉత్తమమైన పద్ధతి.

నేను వృద్ధుడనగు అసహాయవాదినై యొకను మనసులోను పోరాటములోను స్వభావములోను నేనింకను యువకుడనే. రీడింగు ప్రభువు మొట్టమొదట నా సోదరుని నన్ను చెరసాలకు పంపెను. అందులకు నాకతనిపై ఎట్టి పగయును లేదు. కాని రీడింగు తిప్పి నాపినపుడు అతనిని చెరసాలకు పంపుటకు నాకుగూడ నధికార ముండవలెననియే నేను కోరెదను. నేను సంపూర్ణ స్వాతంత్ర్యమునే కోరెదనుగాని నాకు డొమినియను స్టేటసునం దెట్టి నమ్మకములేదు. క్రొత్తగా నిర్మింపబడిన డొమినియను అప్పుయిండియాకు మేమిపుడు వెళ్లజాలము. కానిచో బ్రిటను దేశమువారు పోగొట్టుకొనిన డొమినియను అప్పు యిండియాకే మేము వెళ్లెదము. ఇంగ్లాండు దేశమునందిపుడు నాకొక్కనియందు మాత్రమే అత్యధికమగు నమ్మకము కలదు. అతడు దయామయుడగు విక్టోరియా మనుమడు. ఇతని కాలమున చరిత్ర మరల వ్రాయబడును. మూడవజార్జి అమెరికాను పోగొట్టుకొనెను. అయిదవ జార్జి యిండియాను నిలుపుకొనెను.

* * *

## అయిదవరోజు సమావేశము

### ఎస్. ఎం జోషిగారు

భారతదేశమునకు స్వపరిపాలనాధికారము లభించినంతనే భూలోకము స్వర్గతుల్యముగా మారిపోవునని నే నెన్నడును తలచువాడనుకాను. ఇపుడున్న ప్రభుత్వము భారతశాసనసభలకు బ్రిటిషుపార్లమెంటుకునుగూడ లోబడి యుండకపోవుటచే నిప్పటికంటె స్వపరిపాలనము చేకూరినయెడల కార్మికుల ప్రయత్నము సఫలమగుట కవకాశములు హెచ్చుగా నుండగలవనిమాత్రమే నేను నమ్ముచున్నాను.

స్వపరిపాలనా విధానమును నిర్ణయించునపుడు కార్మికుల ప్రధాన హక్కులనుగూడ దానిలో స్పష్టపరుపవలెను. ఫెడరేషనులో సంస్థానములు గూడ చేరుటకు నేను చాల సంతసించుచున్నాను.

### బేగము షానవాజు సాహెబా

ఈ సభ కేవలము అపూర్వమనుట కెట్టి సంశయము లేదు. ఇట్టి రాజకీయసభలకు భారతీయస్త్రీల నాహ్వానించుటకు గూడ నిదియే ప్రారంభము. స్త్రీలు తల్లులుగను సోదరీలుగను భార్యలుగను పురుషులకు సరియైన దారిని చూపించి సరియైన మార్గమున వారిని నడిపించుట స్త్రీలకు విధియైయున్నది. ఫెడరలు విధానమే ఉత్తమము. సంస్థానాధిపతులుగూడ భారతమాతకు నిజమైన బిడ్డలే యని వారీసభలో ప్రపంచమునకు వెల్లడించినందుకు నేను మిక్కిలి సంతసించుచున్నాను.

### సర్ మిర్జా యిస్మాయిలు సా॥

ఈసభవలన బ్రిటను భారతదేశముల మైత్రి యెంతవరకు అభివృద్ధి నొందగలదో దానినిబట్టియే యీసభయొక్క సాఫల్యము నిర్ణయింపబడును. ఇండిపెండెన్సు వాదమునకు నేనెట్టి ప్రాముఖ్యమును గూడ నీయను. యావద్భారత ఫెడరేషనులో చేరుటకు సంస్థానాధిపతులుగూడ సమ్మతించుటచే వారు దేశమాతకు నిరుపమానమగు సేవచేసిరి.

### రీడింగు ప్రభువు

డొమినియను పదమునకు సరియైన యర్థమెన్నడునుగూడ స్పష్టపరుపబడియుండలేదు. అది అని ధారణ మొనరించినను "బ్రిటిషు సామ్రాజ్యమునందుగల యితర అధినివేశములతో సమానమగు స్థానమును భారతదేశమునకు గూడ నొసగవలెను" అనునదియే దీని ముఖ్యాభిప్రాయమని మాత్రము స్పష్టముగానె తెలియుచున్నది. ఈ ఆశయము పూర్తిగా లభించుటకుముందు పరిష్కరింపబడవలసిన సమస్యలు చాలకలవు. ౧౯౧౭వ సంవత్సరమున చేయబడిన ప్రకటనయొక్క సహజఫలితము అధినివేశ స్వాతంత్ర్యమేయని బ్రిటిషు లిబరలు పార్టీవారు పూర్తిగా నంగీకరించియే యున్నారు. పార్లమెంటు వారికి తగిన సూచనలను చేయుటకు మనలో మనకు సమాధానము కుదుర్చుకొనుటకే యీసభ యేర్పాటు చేయబడెను. కాన అధినివేశములతో సమానమగు గౌరవమును రాజ్యాంగ విధానమును స్థానమును భారతదేశము యీ క్షణమునందే బడయజాలదు.

### నవనగరు రాంజీమహారాజా

సంస్థానములలో నివసించుచున్న వారిని సబ్జక్ట్సు అనగా పక్షముగా సబ్జక్ట్సు అనగా లోబడిన వారని అర్థమగును. సంస్థానములలో నుండువారు ప్రజలు. ప్రజలనగా బిడ్డలు గాని లోబడినవారు కారు. సంస్థానములలో పాలనాధికారము పవిత్రమగు సంయుక్త కుటుంబాశయముపైననే ఆధారపడి యున్నదను విషయమును సంస్థానాధిపతులు పూర్తిగా గ్రహించియున్నారు. అధినివేశ స్వపరిపాలనాధికారమును లభించుటకు ఫెడరలు విధానమొక్కటియే సాధనమైయున్నది.

### కె టి పాలుగారు

ఇండియా గవర్నమెంటు అధికారమున కెట్టిలోపమును కలుగని పద్ధతిని డొమినియను స్టేటసును వెంటనే యొసగవలెననియే దేశీయ క్రైస్తవులుగూడ కోరుచున్నారు.

### అంబడ్కరుగారు

బ్రిటిషువారు తమ్మను ఉద్ధరించెదరనియే మా దేశమునందలి నిమ్నజాతులవారు గంపెడాశతో నుండిరి. కాని బ్రిటిషువారు నిమ్నజాతులవారి స్థితి నెంతమాత్రమును చక్కపరచ గలిగియుండలేదు. ప్రస్తుతమున్న సాంఘిక ఆర్థిక స్థితులను మార్చుటకు దొరతనమువారు పూనుకొనినచో ప్రజలు ప్రతిఘటింతురను భీతిచే బ్రిటిషువారిందులకు పూనుకొనలేదు. కాన నిందులకు తగిన అర్హత బ్రిటిషువారి కెంతమాత్రమును లేదు. కావున తగిన రక్షణలతో డొమినియను స్టేటసు నియ్యవలెననియే నిమ్నజాతులవారుగూడ కోరుచున్నారు.

* * *

## ఆరవరోజు సమావేశము

౨౦ తేదిన జరిగిన సమావేశమున స్పీకర్ రాజా షేకు మహమ్మదు ఖాన్ యాదవు, కన్నలు, వాస్కరు, చింతామణి, ఆగాఖాను ప్రభృతులు ఉపన్యసించిరి. అనంతరము రామ్సేమెక్డొనాల్డుగారు ఉపన్యసించుచు గతమునుగూర్చిగాక ఆగమమును గూర్చియే ఆలోచింపదగుననియు, బ్రిటిషుప్రభుత్వము చేసిన వాగ్దానముల భంగపరుచలేదనియు, రెండు దేశములకును విఖ్యాతికరమగు రాజ్యాంగ విధానమును నిర్మించ వలయుననియు, ఐకమత్యమే ప్రధానమనియు, వాక్రుచ్చిరి. తరువాత ఫెడరలు రిలేషన్సు కమిటియొక్క సమావేశము ౪ తేది సోమవారమునాడు మధ్యాహ్నము జరుపుటకు నిశ్చయింపబడెను.

## ఒక మహారాష్ట్ర బాలికను ఫరారుచేయుట

### ఒక మోటారు డ్రైవరు సాహసము

### పోలీసు ఇన్స్పెక్టరు సహాయము

[మా విలేఖరి]

అజూరు ౬ తేదిన నాంపల్లిలో నివసించు అంబాబాయి యను నొక వృద్ధ మహారాష్ట్రస్త్రీయు, సుమారు ౧౬ వత్సరముల వయస్సుగల ఆమె విధవ కూతురు సోనాబాయియును, గ్రుడ్డి కుమారుడును, తమ స్వస్థానమగు బోధన్ తాలూకాకు వెళ్లుటకై నిజామాబాదు స్టేషనులో దిగిరి. అచ్చటినుండి రుద్రూరు వరకు సర్వీసుమోటారు కారులో వెళ్లిరి. అక్కడ మోటారుదిగి పై ముగ్గురు స్వగ్రామమగు సిద్దాపూరునకు పాదచారులై వెళ్లుచుండిరి. వారివెంబడి ఒక మహమ్మదీయుడును, ఒక హిందువుకూడ దిగి ఎచ్చటికో పోయిరట.

అంబాబాయి వృద్ధ స్త్రీ యగుటచేతను, కుమారుడు అంధుడగుటచేతను, వీరిద్దరు మెల్లగా వెనుక నడుచుచుండ కూతురు సోనాబాయి ముందు నడచుచుండెను. కొంత దూరము పోవునప్పటికి ఈ సోనాబాయి వీరికి కనబడదయ్యెను. మొదట ఆమె వడిగా నడచి యింటివైపు వెళ్లి యుండునని వారు తలంచిరి. కాని ఆ వృద్ధురాలును, అంధుడును, యింటికిచేరి విచారించగా సోనాబాయి జాడ వారికి తెలియలేదు. కనుక ఆ బాలికకొరకై తమ బంధువుల ఇండ్లుగల పరిసర గ్రామములందు వెదకి వెదకి వేసారి, అంబాబాయి ౧౨ వ నాడు హైదరాబాదునకు వచ్చి జరిగిన వృత్తాంతమంతయు, నాంపల్లిలో జెప్పెను. అంతట వారి బంధుగులందరు హైదరాబాదులో వెతుకసాగిరి అంబాబాయి రుద్రూరువద్ద తమతోదిగిన పురుషుల ఆకృతిని వర్ణింపగా, నాంపల్లిలోని ఒక మహమ్మదీయునిమీద ననుమానపడి, ఈసంగతినంతయు, కొత్వాలుగారి మదద్గారగు ఎస్. ఎస్. రెడ్డిగారితో ౧౩ వ తేది రాత్రి విన్నవించిరి ౧౪ వ తేది ఉదయం శ్రీ రెడ్డిగారు తమ మోటారు కారులోవచ్చి అనుమానాస్పదుడగు కమురుద్దీన్ అను మహమ్మదీయుని పట్టుకొని కనబడకున్న బాలికను, చూపమని గట్టిగా నడిగిరి తటాలున నడిగిన ఈ ప్రశ్నకు వాడు ఏమియు చెప్పలేక నిశ్చేష్టుడై తనదోషము నొప్పుకొని వెంటనే రెడ్డిగారిని మోటారులో తీసికొనివెళ్లి పురోద్యానవనమువద్దనున్న ఆరాముషుబల్లా నొక యింటిలో బాలికను చూపెను. వెంటనే కమురుద్దీనును, సోనాబాయిని అరెస్టుచేసి తీసికొని వెళ్లిరి కొత్వాలుగారివద్ద విచారణ జరుగుచున్నది డాక్టర్లు సోనాబాయి మైనరని సర్టిఫికెటు యిచ్చినారట సోనాబాయి యిప్పుడు పైన చెప్పబడిన యింటిలోనె పోలీసు కావలిలో నుంచబడి యున్నది. పండు రంగజోషీ, రంభాదాసరావు వకీళ్లు అంబాబాయి పక్షమున కేసును నడిపించు చున్నారు

కమురుద్దీన్ — ఇతడు మొదట బొంబాయిసైకిలు మార్టు కంపెనిలో డ్రైవరుగా నుండెను. మోటరుల బాగుచేయుట నేర్చుకొని దొంతి ధారవారి నాశ్రయించి వారితో వర్కింగు భాగస్తుడుగ చేరి "రెడ్డి ఆటొమొబైల్ వర్క్సు" కంపెనీని గ్రామరు స్కూలు ఎదుట తెరిపించి అచ్చట మెకానిక్‌గా పనిచేయు చున్నాడు ఈ తనికి స్వంత భార్యయు పిల్లలును గలరు ఇతని కొరకై రుద్రూరు సమీపము నుండి సోనాబాయినితోలించినవారు ఖాజాఖాన్ అను మహమ్మదీయుడును, చన్నయ్య అను ఆది మాంధ్రుడట. వీరే అంబాబాయికి రుద్రూరువద్ద మోటారుదిగి నప్పుడు కన బడిన వారట

ఖాజాఖాన్ — ఇతడు మొదట కొత్వాలుగారి మోటారు డ్రైవరుగా నుండి ఇప్పుడు సిటీ పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు అయినారు.

చన్నయ్య — ఇతడు కమురుద్దీన్ క్రింద కార్ఖానాలో క్లీనరుగా పనిచేయు చున్నాడు.

ఈఅభియోగము హైకోర్టులో జరిగినది. నేడు తీర్పు వినిపింపబడును.

---







